# సత్యం శివం సుందరం



## ప్రథమ కిరణం: మాలకొండ నోట, మంచిమాట

పద్యకావ్యం

రచయిత

## డా. ఉండేల మాలకొండారెడ్డి

హ్యూస్టన్, టెక్సాస్‌లో జూలై 5-6, 1996 తేదీలలో
అతి వైభవంగా జరుగుతున్న
నాల్గవ 'ఆటా' తెలుగు మహాసభల సందర్భంగా వెలువరిస్తున్న
ప్రత్యేక ప్రచురణ

ప్రచురణ కర్త

**వంగూరి ఫౌండేషన్ ఆఫ్ అమెరికా**

హ్యూస్టన్, టెక్సాస్

# SATYAM SIVAM SUNDARAM

## First Ray : MALAKONDA NOTA MANCHIMATA
## (A Collection of Telugu Poems)

**Author :**
Dr.Vundela Malakonda Reddy

**First Edition :**
July, 1996 Copies : 400

**Second Edition (Revised) :**
December, 1996 Copies : 1000

**Editor and Cover Design (First Edition)**
Dr. Pemmaraju Venugopala rao, Atlanta, GA



**Publisher :**
Vanguri Foundation of America, Inc.
Dr. Raju Vanguri, President
P.O. Box 1948, Stafford, TX 77497
Tel : 713-493-9054, Fax : 713-499-8179

**For Copies in India :**
Dr. V. Malakonda Reddy
H. No. 8-2-693/2/26, Behind C.R.P.
Mithila Nagar, Road No. 12
Banjara Hills, Hyderabad - 34.
Phone : 399188

**Price Rs. 30**

**For copies in USA from publisher :**
Tax Deductible Donation : US $10 (or more)
US Federal Tax I.D. # 76-0444238
ISBN # 0-9647541-5-0

**First Edition :**
Astro Printing
10802 Roark Rd
Houston, TX 77099

**Second Edition**
Crescent Enterprises
Chikkadpally, Hyderabad - 500 020.
Phone : 7630321.

# ముందుమాట

లోకరీతిని వేదాంతరీతిని రంగరించి పద్యాలలో నింపిన వాడు యోగి వేమన. ఆయనది అత్యంత సరళమైన ప్రజాభాష. అందుకే ఆ పద్యాలు ప్రజల నాల్కలపై నాట్యమాడుతూ చిరంజీవులైనయ్. ఆటవెలది మూడుపాదాలతో మూడు లోకాలను నటింప చేసిన ప్రతిభాశాలి వేమన. ఆయన శైలి అనితర సాధ్యం. ఆయన పద్యాలను సాహిత్యంగా, ఆయనొక కవిగా సమకాలీన పండిత లోకం గుర్తించ లేదన్నది నిర్వివాదాంశం.చేవగల విత్తనం. మట్టిలో వేసి త్రొక్కినా, మింటికి జీవవృక్షమై లేచినట్లు, ఆయన అమృత వాగ్బీజాలు, సామాన్య ప్రజల హృదయ క్షేత్రాలలో మొలిచి, చిగురించి, పుష్పించి, సుగంధాలు వెదజల్లినయ్. ఆంగ్లేయుడైన బ్రౌను మహాశయుడు ఆ సుగంధాన్ని ఆఘ్రాణించి, ఆనందించి, రసజ్ఞులకు పంచి పెట్టినాడు.

పద్యం తెలుగు వారి సొత్తు. అందులో వేమన పద్య శైలి, చిన్మయ రసానందకేళి. ఆయన పద్యాలను కంఠస్థం చేయని, ఉదహరించని తెలుగువాడు లేడంటే అతిశయోక్తి కాదు. ఒక్కసారి వింటే లేదా చదివితే ధారణకు నిలిచే రసగుళికలు వేమన పద్యాలు. ఆయన రచించిన పద్యాలు పదివేలకు పైగా ఉండవచ్చని పరిశోధకుల అభిప్రాయం. అందులో ఇతరులు రచించినవి వేమన రచనలు గా చలామణి అయ్యేపద్యాలెన్నో ఉండవచ్చు ఆయన రచనా శైలి ఎంత బలమైనదంటే, ఎవరు వ్రాసిన పద్యమైనా అందులో కొట్టుకొనిపోవచ్చు. అందులో ఆటవెలదిఆయన ప్రేయసి. ఆమె హృదయం ఆయనకే అంకితం. ఆహృదయంలో కొంతైనా స్థానం సంపాదించుకోవాలని ప్రయత్నించే పద్యకవులెందరో ఉన్నారు.

నా భావాన్ని ఆటవెలది పాదాలలో అందంగా ఆడించి, సహృదయులకు అందించాలని నా ఆశ. మారుతున్న ఆధునిక మానవ మనః ప్రవృత్తుల్ని, మానవత్వపు విలువల్ని గూర్చి నేను వెలువరిస్తున్న విభిన్న భావాలు పాఠకులకు చేరగలిగితే నాయీ చిన్ని కృషి ఫలించినట్లే. అనుభవశీలురైన పాఠకులు నా మంచిమాటను విని ఆలోచిస్తారని ఆశిస్తున్నాను. ఈ కావ్యాన్ని ముద్రించి హ్యూస్టన్‌లో ఆవిష్కరించుటకు సహాయ సహకారాలందించిన శ్రీ వంగూరి చిట్టెన్ రాజుగారికి, అమెరికా తెలుగు అసోసియేషన్ వారికి పరిచయం వ్రాసిన సాహితీ మూర్తి, ప్రసిద్ధ శాస్త్రజ్ఞుడు డా॥ పెమ్మరాజు వేణుగోపాలరావు గారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

ఇట్లు

జూలై 2, 1996 — డి. డా. ఉండేల మాలకొండా రెడ్డి

డిసెంబర్ , 1996

## FROM THE DESK OF THE PUBLISHER

Vanguri Foundation of America is pleased to present this unique and brilliant collection of poems by the well-known poet Dr. Vundela Malakonda Reddy from Hyderabad, Andhra Pradesh. These poems are written in Ataveladulu format, best known to Telugu people through Vemana Satakam. This is the sixth publication of the foundation in the past two years.

Dr. Malakonda Reddy is prolific writer and published his first book in 1946. He has written six Telugu books and two poetry collections in English. He is driving force behind several educational and health care programs and sometimes I wonder he is able to accomplish so many tasks so well. It is my privilege to have this opportunity of associating with him in his literary pursuits

In addition to this book, we are also publishing two more books this month. One is a collection of English poetry by Mr. A. Rao Our objective is to encourage English literary activities of people of Indian origin and assist them in finding their rightful place in the American mainstream literary world. This effort is significant because the second generation is fast evolving into profile writers in English. They need a forum and our encouragement. Vanguri Foundation intends to do just that.

We sincerely thank the officials of ATA for releasing these three books at the 4th ATA Conference in Houston, Texas, July 5-6, 1996. We also thank the financial supporters for their generous assistance.,

Once again, publication of this book would not have been possible without the time and talent of Dr. Pemmaraju Venugopala Rao who has meticulously gone through the poets work and brought it to its final form. I also thank Bhagavatula Sudha and Anand Mohan for their help in Telugu tyesetting. Special appreciation to Y. Babji Rao, Kankam Babu Suneetha and Jhansi of Astro Printing for their professional and friendly assistance.

Vanguri Foundation of America, Inc
Houston Texas
July 1, 1996

Vanguri Chitten Raju
President

# పరిచయం

పెమ్మరాజు వేణుగోపాల రావు

మానవ మనః ప్రవృత్తుల్ని, మానవత్వపు విలువల్ని గూర్చి నేను వెలువరిస్తున్న భావాలు అంటూ మాల కొండారెడ్డి గారు నూట నలభై ఆరు పద్యాలు మనకు అందించారు. ఈ రచనలో, వేమన కవిత ఆదర్శంగా పెట్టుకుని సమకూర్చిన ఈ మంచి మాటలు వీరి కలం నుంచి సునాయాసంగా జారి దిగిన మాటల తోరణాలుగా ప్రస్ఫుటిస్తున్నాయి. ఏ భాషలో ఉచ్చరించినా నీతి. నిజాయితీలు క్లుప్తంగా, సరళంగా , హృద్యంగా ఉండే మాటల్లోనే వినిపిస్తాయి. సాధారణంగా, అందుకనే ఆటవెలది, తేటగీతి, కందం లాంటి చిన్న పద్యాల్లో అల్లుతారు చాలామంది తెలుగు కవులు తమ ఆలోచనలని. పద్యానికినాలుగు పాదాలున్నా భావం అంతా మొదటి మూడు పాదాల్లో ఇముడుస్తారు: ఆచారం ప్రకారం నాలుగో పాదం కవిస్మరణ చేసుకోటానికి వాడుకుంటారు కాబట్టి.

ప్రతి పద్యంలోను తన పేరు పెట్టుకోవాలనే కవి అహంకారదు దీనికి కారణం ప్రతి పద్యంఒక ప్రత్యేక విషయం గురించి వ్రాయబడుతుంది. అందరూ అన్ని పద్యాలుఒక్కసారి కూర్చుని చదివెయ్యక్కర్లేదు. ప్రతి పద్యంలోనూ కవిని స్మరించవలసి వచ్చే మకుటం ఇముడ్చబడింది. శతక వాఙ్మయంలో ఇదిశాస్త్రసమ్మతం. ఈ రచన శతకంకంటెపెద్దది. ఇది షట్చత్వారింశతోత్తర శతపద్యావళి

తెలుగు భాషలోనే కాదు ప్రపంచంలో ఇతర భాషలలో కూడ ఇటువంటి క్లుప్తమైన 'మినీ కవిత' లు పరిపాటి. కాని అందరూ ఛందోబద్ధంగా వ్రాయక పోవచ్చు. ఛందస్సుతో నియమిత మైతే · ఇది పద్యం అనుకోవటం పూర్వాచారం. ఇప్పుడు కాదు. జపానీసు సాహిత్య సాంప్రదాయంలోమూడు పాదాలతో ముచ్చటగా వ్రాయబడే హైకు ఈ రచనలోని పద్యాల తరగతికి చెందినదే. కాని వాటికిమకుటం అంటూలేదు.

ఇంతకీ ఈకవిత విశిష్టత ఏమిటంటే ఎంత లోతుగల భావాన్నయినా, ఎంతపొడుగు పాటి వృత్తాంతాన్నైనా వ్యస్త పదాలు, వృధా ప్రసంగాలు, అనవసరపు అలంకారాలు లేకుండా నిపుణతతో చెప్పగలిగి ఉండాలి. కవి పద్యం వింటూంటే ఉన్నకొన్ని క్షణాలతోను దాంట్లో కవి సమకూర్చిన భావ చిత్రం ( ఇమేజ్) ఆంతర్యం (ఇన్‌సైట్) ఒక్కసారి మన మనస్సులో మెరుపులా వెలిగి మనకి అవగాహనకావాలి, అంటే కవికికావలసినది భాషా ప్రవీణతే కాదు. భావచిత్ర కల్పనలోనూ, సత్య సందర్శనంలోను కూడ ప్రతిభ కావాలి. ఈ రెండింటిలోను, ప్రావీణ్యత గల కవి హృదయం లోంచి ధారగా ప్రవహించిన కవిత మనకి ఎదురవుతుంది ఈ రచనలో.

బిడ్డపాలకేడ్చునదియె ప్రథమ భాష అంటూ భాషకు మన జీవితంలో గల ప్రాముఖ్యతని వెల్లడి చేశారు. కవి తన కావ్యాన్ని సందర్భానుసారంగా తన సమాజంలోని శ్రోతలని ఉద్దేశించి వ్రాస్తాడు. తన కావ్యానికి సరిహద్దులు శ్రోతల పరిచయం, ఉత్సాహం. ఆత్మాశ్రయంగా వ్రాసినా సామాజిక స్పృహతో వ్రాసినా,

కాక ఆధ్యాత్మిక చింతనతో వ్రాసినా శ్రోతల అనురాగ, ఆసక్తులు కవిత సఫలమవడానికి చాలఅవసరం. మనందరి అనురాగానికి ఆసక్తి తగిన కవితలు ఇందులో కనిపిస్తాయి.

నిత్యం మనం మాట్లాడుకునే వాక్యధోరణిలో వ్రాసిన ఈ పద్యాలలో వ్యక్తి, కుటుంబం, సమాజం, ప్రపంచం - లోకాన్ని అన్ని వ్యవస్థలలోనూ సందర్శిస్తాం. అనేకరకాల భావ చిత్రాలు: కాలికింద చెప్పు, గంతమోయుచున్న గాడిద, బండి నెక్కిన కాకి, వెన్న దొంగ, బొమ్మ బొరుసు, బురదవెదకు పంది, పుండు వెదకు కాకి, ఆకసమున చంద్రుడు, నింగిపోవు మబ్బు - వీటిని పరికరాలుగా వాడి వ్యక్తుల మనస్తత్వాలే కాదు సంఘంలో చీకటివికారాలాను కూడా వీరి దృష్టి విశ్లేషించి పరిశీలించింది. సీతనడవికంపిన రాముడు, ఏడుకొండలెక్కిన వెంకటేశుడు, అలినమ్మినహరిశ్చంద్రుడు కూడా ఈయన సిద్ధాంతాలకు తోడ్పడ్డారు. ఇక మనతో మాట్లాడలేక పోయినావిశ్వంలో ఉన్న రకరకాలప్రాణులు - గార్ధభము, పికము, చేప, గ్రుడ్డు, మత్తగజము, చీమ , బెబ్బులి, సాలీడు, తేలు, పాము, గుంటనక్క, కుక్క, పక్షి - వీరి మాటలకి చేదోడుగా ప్రవేశిస్తాయి.

మామూలు మాటలలోసార్వజనీనకమైన సూత్రాలను ఇమిడ్చారు: జీవితమున చూడ జీతము ముప్పాళ్లు: చత్తుననెడివాడు చావడు నిజముగా: అడవిలోన కూడ హద్దులున్నవి, డాలరున్నవాని డాబువేరు, పతిని అంటకున్న సతికి సంతతియున్నె, చెట్టు పెరుగు కొలది చీలదా శాఖలై ! కలియుగమ్మె కాదు కలితీ యుగమ్మిది ఎంత చిన్నదాయె ఈ ధరావలయమ్ము!

దొంగ స్వాములవార్లని పరిహసించారు. హింసావాదులని దూషించారు. లంచగొండితనాన్ని నిరసించారు. బుద్ధిలోన స్త్రీలు పురుషు లొక్కటి గాద ! అని సమానత్వాన్ని సమర్థించారు.

ప్రకృతిసిద్ధమైన పరమాద్భుతములకు
కర్త యెవడొ మనకు కంట బడడు
అతని వెదకు కొనుటె అసలైన మతమురా

అంటూ మనకు ప్రశ్న ఇచ్చారు మననం చేసుకోవడానికి -

సృష్టికర్త సృష్టి సృష్టించె నందురు
సృష్టికర్త నెవడు సృష్టిజేసె
స్పష్టపరచు నెవడు సృష్టి రహస్యమ్ము !
మాలకొండ నోట మంచి మాట

అట్లాంటా

జార్జియా

జూలై 5, 1996.

శేషేంద్ర శర్మ

జ్ఞాన్‌బాగ్
హైదారాబాదు
500 012.

# కవి మాట మనిషికి బాట

శ్రీ ఉండేల మాలకొండారెడ్డి ఆంధ్రదేశంలో కవిగా లబ్ధ ప్రతిష్ఠుడు. నెల్లూరు రాజవీధులు ఆయన కవిత్వంతో మారు మోగుతున్న నాడు, నేనింకా గొంతు సవరించుకుంటున్నాను. మాలకొండారెడ్డి సాత్త్వికుడు; అంటే మాలకొండా రెడ్డిసముద్రం అన్నంత అర్థం ఉంది ఇందులో. మానవ స్వభావమే కావ్య స్వభావమని గుర్తించిన శారదాతనయుడు తన భావ ప్రకాశంలో "పరస్య సుఖః దుఃఖాదేః అనుభావేన చేతసః తద్భావభావనం యేన భవేత్ తదను కూలతః తత్సత్త్వం" అన్నాడు. సత్త్వ గుణం చేతనే వాల్మీకి "క్రౌంచవధ" చూచి దుఃఖం పొందాడు. అలాగే మాలకొండారెడ్డి సత్త్వగుణప్రధానుడు; కనకనే ఆయన అన్యుల సుఖదుఃఖాల్లో విలీనత పొందుతాడు. అందుచేతనే ఆయన మొదటి కవి అయ్యాడు, తర్వాత విద్యా ప్రదానము, నివాస ప్రదానము, ఔషధ ప్రదానము చేశే సంస్థల్ని నెలకొల్పి విస్తృతంగా దుఃఖార్తులకు సేవ చేశాడు.

సత్త్వ గుణమే కవిత్వానికి జన్మస్థానము. సత్త్వ గుణం, కామక్రోధ మోహ మద మాత్సర్యాలను తొలగదీసినప్పుడే, ఉదయిస్తుంది. అప్పుడే అతడు అన్యులతో తనని కలుపుకొని జీవిస్తాడు. అప్పుడు అతని నోటి నుంచి సత్యమే నిర్గతమవుతుంది. ఒక్కొక్కప్పుడు కేవలం సత్యం చెప్పడం చేతనే ఆ మాటకు చమత్కార ప్రభావం సిద్ధిస్తుంది. అసత్యాల గుంపుల్లో సత్యం ఆశ్చర్య జనకంగా ఉంటుంది. ఉదాహరణకి, ''సులభాః పురుషాః రాజన్ సతతం ప్రియవాదినః అప్రియ స్యతు పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః'' (మనకిష్టమైన మాటలు చెప్పే వాళ్ళు ఎప్పుడూ సులభంగా దొరుకుతారు. హితము కానీ, అప్రియము అయిన మాటలు చెప్పేవాడు కానీ, వినేవాడు కానీ దొరకడం దుర్లభం.) ప్రాచీనమైన ఈ భారతదేశంలో సంస్కృత వాఙ్మయం నిండా శ్రోతలను చకచ్చకితుల్ని చేసే, సత్యానికి శబ్ద రూపాలైన సూక్తులు సుభాషితాలు, కోకొల్లలుగా వెదజల్లబడి ఉన్నాయి. ఈ సుభాషితాలు మహాకవుల కావ్యాల్లో నుంచి తీసుకుని అన్య గ్రంథ కర్తలు తమ గ్రంథాల్లో పేరు చెప్పకుండా వాడుకోవడం కూడా సంస్కృత వాఙ్మయంలో ఒక అలవాటు.

అది అగౌరవంగా భావింపబడలేదు! వెనక ఉదహరించిన ''సులభాః పురుషాః రాజన్ ....'' అనే శ్లోకం మారీచుండు అరణ్యాకాండంలో తన రాజయిన రావణాసురుడికి హిత బోధ చేస్తూ చెప్పిన మాట. కానీ ఆ శ్లోకాన్ని యథాతథంగా శ్రీభోజరాజ చరిత్రంలో తద్గ్రంథ కర్త పేరు చెప్పకుండా వాడుకున్నాడు. అట్లాగే ''లతాంపుష్పవతీంస్పృష్ట్వా స్నాతోవిమల వారిషు! పునఃస్పర్శన శంకీవ మందం చలతి మారుతం'' అనే ఒక అజ్ఞాత కవి సుప్రసిద్ధ శ్లోకాన్ని విక్రమార్క చరిత్రకారుడు వాడుకున్నాడు. ఇలాంటి ఉదాహరణలు అసంఖ్యాకంగా ఉన్నాయి. ఇది ఈ దేశంలోసుభాషితాల సంగతి.

అయితే సుభాషితం ఎప్పుడూ సాత్వికుడినోటినుంచేవస్తుంది. వేమన, యోగి కనకనే, వేమన పద్యాలనే ఒక సుభాషిత హిరణ్యమని మనదేశంలో ఉంది. యోగం చేతనే మానవుడు సాత్వికుడవుతాడు. ''మాలకొండ నోట మంచిమాట'' అనే ఈ పద్యముక్తావళి సుభాషితాల సంగీతమయమైన సెలయేరు గనక పూర్వులను స్మరించి ఆ సుభాషిత తరంగిణితో ఈ ''మంచిమాట'' అనే మాలకొండ సుభాషితావళిని చేర్చుతున్నాడు.

''మాలకొండ మంచిమాటలు'' మన దేశంలో నేడున్న సమాజాన్ని సమగ్రంగా ప్రతిబింబించి నరకంలోకి దొర్లిపోతున్న మానవుడికి తన మంచిమాటని అడ్డువేసి రక్షించడానికి పూనుకుంటుంది.

''మోసగించినాడు ముని పత్ని నింద్రుడు !
అతడె దేవతలకు అధిపుడయ్యె!
అధిపుడగుటకొరకు అర్హత ఇదియేమొ!
మాలకొండ నోట మంచిమాట!

ఇందులో ఎంత గొప్ప సమకాలీనత ఉందో స్వయం స్పష్టము. సాత్త్వికుడైనవాడి మాట, అంటే కవిమాట, మనిషిని ఆలోచింపజేసి వాడిలోమార్పు తెచ్చింది. కావ్యాలు తెచ్చిన, అంటే సద్భాషలు మనిషిలో కలిగించిన మార్పులే పూర్వయుగాల చరిత్రలో నాగరికత లనబడ్డాయి. మనిషిని మనిషే తినడానికి పరుగులుతీస్తున్న ఈ వర్తమాన కాలాన్ని ''మాలకొండ నోట మంచిమాట'' ప్రభావితం చేస్తుందని నా విశ్వాసం.

# ఒకమాట

''మాలకొండ నోట మంచిమాట'' అనే కావ్యం 146 పద్యాలతో జూలై 1996న హూస్టన్, అటా సభలలో అమెరికాలో ఆవిష్కరించబడినది. ఇందులకు సహకరించిన మిత్రులు, సహృదయులు శ్రీ వంగూరి చిట్టెన్ రాజు గారికి, జ్ఞాన సంపన్నులు శ్రీ పెమ్మరాజు వేణుగోపాలరావుగారికి నా హృదయ పూర్వక నమస్సుమాంజలులు.

ఇందులోని 30 పద్యాలను సంగీతంతో జతపరచి ''సత్యం శివం సుందరం'' అనే పేరుతో క్యాసెట్‌గా రూపొందించుటలో సహకరించి ప్రధాన పాత్ర వహించిన డా. ఎం.ఎస్. రెడ్డిగారికి నాధన్యవాదములు.

నేడు కొన్ని పద్యాలు చేర్చి ''సత్యం శివం సుందరం'' ప్రథమ కిరణం ''మాలకొండనోట మంచిమాట'' అనే పేరుతో ద్వితీయ ముద్రణ చేయబడింది. ఈ ద్వితీయ ముద్రణకు తన అమూల్యాభిప్రాయం వ్రాసి ఇచ్చిన మహాకవి శ్రీ శేషేంద్ర శర్మ గారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

నాకు చేదోడువాదోడుగానున్న చిరంజీవి పాడేటి జాన్సన్ కు, ద్వితీయ ముద్రణను సర్వాంగసుందరంగా ముద్రించిన ''క్రిసెంట్ ఎంటర్‌ప్రైజేస్'' అధినేత చిరంజీవి సంగీత్ రాజ్ కుమార్ కు నా ధన్యవాదములు. చివరగా ఓ సత్యం చెప్పాలనుకుంటున్నాను.

''సత్యమిదియె కవికి సతియె ప్రోత్సాహము''

గాన నా అర్ధాంగి శ్రీమతి సరస్వతికి ప్రేమాంజలులు.

డా. ఉండేల మాలకొండారెడ్డి

27-12-1996



## డా. ఉండేల మాలకొండా రెడ్డి

రచయిత, 1932లో ప్రకాశం జిల్లా కనిగిరి తాలూకా లోని ఇనిమెర్లలో జన్మించారు.నెల్లూరు జిల్లా అల్లూరు, నెల్లూరు, మద్రాసు గిండీ ఇంజనీరింగు కళాశాల, ఎడింబరో, గ్రేట్ బ్రిటన్‌లలో విద్యాభ్యాసం చేసి, బి.యి. ఎం. ఎస్. సి. పూర్తి చేసి. స్ట్రక్చరల్ ఇంజనీరింగ్‌లో డాక్టరేట్ డిగ్రీ పొందారు.

1955 -57లలో పిడబ్ల్యు.డి. లో సివిల్ ఇంజనీర్ , తర్వాత నాలుగు సంవత్సరాలు ఉస్మానియా యూనివర్సిటీలోను మరో యిరువది సంవత్సరాలు ప్రాంతీయఇంజనీరింగు కలాశాలలో ప్రొఫెసర్‌గా ఉద్యోగం చేశారు. 1979లో చైతన్యభారతిఇంజనీరింగు కళాశాలని, 1986 లో అంతర్జాతీయ వైద్య మహానగర్ (మెడిసిటి), హైదరాబాద్‌లో ప్రారంభించి చరిత్ర సృష్టించారు.

హైదరాబాదులో హోటల్ సిద్ధార్థ, నందనమ్ అపార్ట్‌మెంట్స్, వరంగల్ లో సిద్ధార్థనగర్, చైతన్యపురి మొదలైన నగరాలకు సలహా దారుగా వ్యవహరించారు. ఉండేల విజ్ఞాన కళా పీఠానికి ఫౌండర్ ట్రస్టీ, ఉస్మానియా యూనివర్సిటీ సెనేట్, జవహర్ లాల్ టెక్నాలజికల్ యూనివర్సిటి ఎక్సిక్యూటీవ్ కౌన్సిల్ సభ్యులు మొదలైన గౌరవ పదవులు పొందారు.

శ్రీ మాల కొండా రెడ్డి నేతాజీ (1946) వివేకానందుడు (1953), కాంతి చక్రాలు (1958), మొగలిరేకులు (1981) ఒడిసెల రాళ్ళు (1986), విలపించే ఉత్తరం (1992) మొదలైన తెలుగు రచనలు,Gloating Grass (1988)Special poetry for the international Poets Academy (Madras 1992) మొదలైన ఇంగ్లీషు, రచనలు చేసి, విశ్వ విఖ్యాతి పొందారు.

# అంకితం

విదేశాలలో ఉంటూ

తెలుగుతల్లిని మరువని

తెలుగు వెలుగులకు

1. తల్లి కడుపునుండి ధరణి పైబడు బిడ్డ
పాలకేడ్చు నదియె ప్రథమ భాష
అన్ని భాషలకును అదె మాతృభాషరా!
మాలకొండనోట, మంచిమాట

2. ఏడు సంద్రములనుఈది దాటగ వచ్చు
కొండనైన పిండిగొట్టవచ్చు
వీసమంత ఆత్మ విశ్వాసముండిన
మాలకొండనోట, మంచిమాట

3. విద్య, ధనము, వంశవిఖ్యాతులనుగల్గి,
ఎత్తుకెదిగినంత ఏమి వింత!
ఏమి లేక పైకి ఎదుగుటయే వింత!
మాలకొండనోట, మంచిమాట

4. కొండమీద నున్న బండకు వెలయేది?
పట్టితెచ్చి గోడ పెట్టువరకు,
పట్టి తెచ్చుశ్రమయె బండకు వెలయౌను
మాలకొండనోట, మంచిమాట

5. శ్రమములోన బుట్టు సర్వమ్ము ధనమని,
విశదపరచెనెపుడొ వేమయోగి,
'' మార్క్సు '' చెప్పినట్టి మాటలవే కదా.
మాలకొండనోట, మంచిమాట

6. మాటమార్చుకొనడు, మాట్లాడువిషయమ్ము
మార్చుకొనడు మనసు మార్చుకొనడు
మూర్ఖుడనగ నతడె ముల్లోకములయందు
మాలకొండనోట, మంచిమాట

7. బాటవెంట నడచు బండి నెక్కిన కాకి
నేనె సారథినని నిగిడి పల్కు
మాయదారి జనులమాట లీలాగురా!
మాలకొండనోట, మంచిమాట

8. ఆడినట్లె ఆడు, పాడినట్టులె పాడు,
అనుగు మిత్రుడెందుకయ్య నీకు,
నీడ అంతకంటె నేర్పుగా మెలగదా!
మాలకొండనోట, మంచిమాట

9. పెంచు, పెంచు, జీతమంచు ఉద్యోగులు
ఎపుడు గోలజేతు రెందువలన
జీవితమున చూడ జీతము ముప్పాళ్లు
మాలకొండనోట, మంచిమాట

10. ఆరగించునపుడు నోరూరగా జేయు
తీపి వస్తువెంతొ తృప్తినిచ్చు
చిక్కుదెచ్చిపెట్టు జీర్ణమౌనప్పుడే
మాలకొండనోట, మంచిమాట

11. కనులు తెరచి నరుడు కనలేని తప్పులు,
కనులుమూసినపుడు కానుపించు,
నరుని కండ్లు మూయు పరశక్తి నిద్రరా
మాలకొండనోట, మంచిమాట

12. తాను బాగుపడుట తలపడుమదిలోన ,
ఒరులు బాగుపడిన ఓర్వలేడు,
ఈర్ష్యకలుగువాని నెవడు బాగొనరించు
మాలకొండనోట, మంచిమాట

13. ఆకసమున చంద్రు డగుపించు చల్లగా
అచటికేగి చూడ అగ్నియుండు,
కంటబడినదంత, కాదు యథార్థము,
మాలకొండ నోట, మంచి మాట

14. సత్ప్రవర్తనమ్ము జగతినేలెనుమున్ను
అర్థబలముదాని నణగ ద్రొక్క,
కండబలము నేడు గద్దెనెక్కినదయా
మాలకొండ నోట, మంచి మాట

15. కష్టపడక కోట్లు గడియించెనొక్కడు
బడికి పోక, డిగ్రి బడసెనొకడు
పైరవీల జోరు బరి తెగించెనునేడు
మాలకొండ నోట, మంచి మాట

16. ఒక్క చేపనొసగ ఒక పూటకే భుక్తి
చేప పట్టువిధము చెప్పిరేని,
పూర్తి జీవితమున భుక్తి లభించును
మాలకొండ నోట, మంచి మాట

17. గార్ధభమ్ము, పికము, గాండ్రించు బెబ్బులి
నరుని మానసమున నక్కియుండు,
అవసరమును బట్టి అవి పైకి వచ్చును
మాలకొండ నోట, మంచి మాట

18. కారు, టీ.వి., ఫోను - కాళ్ళు, కన్నులు,చెవుల్
వరుస గాను, నగర వాసి కిపుడు
మనిషి యంత్రమాయె, మనసు దూరంబాయె.
మాలకొండ నోట, మంచి మాట

19. పుట్టు గ్రుడ్డి వాని కిట్టె చూపు నొసంగు
చెవిటివాని కిచ్చు శ్రవణ శక్తి
ధర, పొగడ్తకంటె పరమౌషధం బేది!
మాలకొండ నోట, మంచి మాట

20. ఆకలైనయప్పుడన్నమ్ము దినువాడు,
తలచినపుడె నిద్ర దగులు వాడు,
జగతిలో అదృష్ట జాతకుండనవచ్చు
మాలకొండ నోట, మంచి మాట

21. వేళయైనదంచు విందు కేగెడువాడు,
మందు మ్రింగి నిద్రనందువాడు,
నేటి నాగరికుల నిజమైన గుర్తురా.
మాలకొండ నోట, మంచి మాట

22. చిదిమి తేని గ్రుడ్డు చేతికి చిక్కదు,
పొదిగితేని పిల్లపుట్టవచ్చు
ఓర్పుతోనె లాభమొనగూడుధరలోన
మాలకొండ నోట, మంచి మాట

23. భువనమందు గొప్ప బోధకుడెవడన్న
చీమయనుచు మనము చెప్పవచ్చు
చీమనోరు విప్పిచేయదు బోధలు
మాలకొండ నోట, మంచి మాట

24. 'శ్రీ' యనంగ లక్ష్మి 'శ్రీ' యన సాలీడు
మరియు 'శ్రీ' యనంగ గరళమగును
ఎరుగుమయ్య నిన్ను ఏ 'శ్రీ' వరించెనో
మాలకొండ నోట, మంచి మాట

25. చెప్పు పెద్దదైన, చీకాకుగల్గించు,
ఇరుకుచెప్పు పెట్టు, నరక బాధ,
సిరియనంగ కాలి చెప్పువంటిది సుమా
మాలకొండ నోట, మంచి మాట

26. అడమగలు కల్తి, ఆహారమున కల్తి
వేషమందు కల్తి, భాష కల్తి,
కలియుగమ్ము కాదు కలితీయుగమ్మిది
మాలకొండ నోట, మంచి మాట

27. భయమువలన ఎన్నొ భద్రతా సైన్యాలు,
భయమువలన, ఉక్కుపచ్చడాలు,
భయము, జగతినెల్ల పాలించుచున్నది
మాలకొండ నోట, మంచి మాట

28. తండ్రికెదురు తిరుగు తనయుడు, తాతతో
చెలిమి చేయుచుండు చిత్రముగను
తరము మారినంత తలపులు మారురా!
మాలకొండ నోట, మంచి మాట

29. ప్రేమ యెంతపంచి పెంచిరి తలి దండ్రు
లనుచు తలచు బిడ్డలరుదు నేడు,
ఎంతఆస్తి పెంచియిచ్చిరన్నదె లెక్క
మాలకొండ నోట, మంచి మాట

30. జనకుడిచ్చె వరము, సవతి తల్లి కటంచు
వినిన రాముడేగె, విపినములకు
కొడుకులిపుడువిన్న, కోర్టుకుపోదురు
మాలకొండ నోట, మంచి మాట

31. చత్తున నెడువాడు చావడు నిజముగా
ఇత్తుననెడు వాడు ఈయబోడు,
చేయదలచువాడు, చెప్పడుముందుగా
మాలకొండ నోట, మంచి మాట

32. పాత్రుడగునొ కాదొ పరికింపకయె, మేలు
చేయరాదు, అట్లు చేసితేని,
మేలు పొందువాడె, మేకుగా మారును.
మాలకొండ నోట, మంచి మాట

33. డప్పుగొట్టు తనదు గొప్పతనము గూర్చి,
కప్పిపుచ్చుకొనునుతప్పులన్ని,
కుటిల జనుని తీరు గురిగింజ చందము
మాలకొండ నోట, మంచి మాట

34. బురద వెదకు పంది, పుండు వెదకు కాకి,
కుళ్ళుశవము వెదకు గుంటనక్క,
దుష్టబుద్ధి, పరుల దోషాలు వెదకును,
మాలకొండ నోట, మంచి మాట

35. తేలుకుట్టెనేని తేరుకోవచ్చును,
పాము కరిచెనేని బ్రదుకవచ్చు,
మనిషి కాటు వేయ మందు లేనే లేదు
మాలకొండ నోట, మంచి మాట

36. మూర్ఖుడైన వాడు, ముందరబడెనేని,
వాదులాడవలదు వాని తోడ,
ఇరువురకును భేద మెరుగలేరెవ్వరు
మాలకొండ నోట, మంచి మాట

37. చేదు నిర్ణయములు చేయక తప్పదా?
పెక్కుమంది మీద పెట్టవలయు,
తప్పునెట్టవచ్చుతక్కిన వారిపై
మాలకొండ నోట, మంచి మాట

38. ఎదుటివాని నెపుడు హేళన జేయుచు
తనను దానె పొగడు కొనెడు వాడు,
అల్ప బుద్ధివాడు, అతని జోలికి పోకు
మాలకొండ నోట, మంచి మాట

39. కష్టమెట్టిదైన కన్నీరు నించకు,
కంటినీరు చూపు కప్పివైవ,
భావి స్వప్నములను పరికింపగాలేవు
మాలకొండ నోట, మంచి మాట

40. ఎదుట నీడ జూచి, బెదిరిపోవకుమన్న
బెదిరిపోవ, దీక్ష చెదరిపోవు,
నీడవెంట వెలుగు నిశ్చయమ్ముగనుండు
మాలకొండ నోట, మంచి మాట

41. ఆచరింప సాధ్యమైనను కాకున్న
ఉన్నతాశయమ్ము ఉండవలయు
నావకు దెసచూపు నక్షత్రమట్టుల
మాలకొండ నోట, మంచి మాట

42. బలము చేత గొప్ప పనులు సాధించితి
గెలుపు పొంది తనుచు తలప బోకు
బలముకంటె పట్టుదల ప్రధానంబురా
మాలకొండ నోట, మంచి మాట

43. ఏదిమంచి, చెడ్డయేదొ, తేలనివేళ
ఆలకింపు మంతరాత్మ ఘోష
అంతరాత్మ కంటె ఆప్తమిత్రుడెవండు!
మాలకొండ నోట, మంచి మాట

44. కాలిక్రింద చెప్పుగదయని, చుల్కన
చేసి త్రొక్కబోకు, చేటుగల్గు
అదను చూచి చెప్పు పదమును కాటేయు
మాలకొండ నోట, మంచి మాట

45. గంతమోయుచున్న గాడిద యనియెంచి
బరువు లెన్నొ మోపి తరుమబోకు,
నిన్ను కాళ్లతోడ తన్నక మానదు
మాలకొండ నోట, మంచి మాట

46. అప్పుచేయు నప్పుడందరు మొనగాళ్లె,
కంటబడరు తీర్పు కాలమందు,
అప్పులేని పౌరుడగుపింపడీనాడు
మాలకొండ నోట, మంచి మాట

47. అప్పుచేయబోకు, అప్పులీయగబోకు,
అప్పువలన ముప్పుతప్పదయ్యా,
ధనము పోవు, పోవు దానితో స్నేహమ్ము
మాలకొండ నోట, మంచి మాట

48. ఆలినమ్మె అప్పుకై హరిశ్చంద్రుడు
ఏడు కొండలెక్కె ఎంకటేశు
అప్పుచేయువారి అగచాట్లు చూడరా!
మాలకొండ నోట, మంచి మాట

49. అడవిలోన గూడ హద్దులున్నవి, క్రూర
జంతువులకు అన్ని సమయములకు,
హద్దులేనివాడు అధునాతన నరుండె
మాలకొండ నోట, మంచి మాట

50. ఎందు పాదమిడిన, ఏదేశమేగిన,
'డాలరు' న్న వాని డాబువేరు
మనదు రూక కట్టి మహిమ యెప్పుడు వచ్చు!
మాలకొండ నోట, మంచి మాట

51. జలధి కూడబెట్టు జలము నావిరి జేసి,
భానుడిచ్చు భువికి వర్ష జలము,
కూడబెట్టువారు గుర్తుంచుకొనుడిది
మాలకొండ నోట, మంచి మాట

52. ధనము తక్కువైన మనిషి బాధలు పడు
ఎక్కువైన గూడ చిక్కునబడు,
ధనము సుఖమునిచ్చు తగుమాత్రమున్నచో,
మాలకొండ నోట, మంచి మాట

53. ధనము, గుణము, బలము, ధైర్య సాహసములు
ఉన్నవారు, లేక యున్నవారు
వీరిమధ్యనెపుడు విడిపోని జగడాలు
మాలకొండ నోట, మంచి మాట

54. ఇల్లు, పొలము, నగలు, ఇత్యాదులన్నియు
ఆస్తులనెడు రోజులంతరించె,
నీదు ఆస్తి, నీదు నిర్ణయ శక్తిరా
మాలకొండ నోట, మంచి మాట

55. రణము చేసి, మునుపు, రాజ్యముల్ గెల్చిరి,
రణము బదులు, నేడు ఋణములిచ్చి,
దేశములను పరులు దిగమ్రింగుచున్నారు
మాలకొండ నోట, మంచి మాట

56. జలములిచ్చునదులు, ఫలములిచ్చును చెట్లు,
జీవకోటికెపుడు సేవ చేయు,
ప్రతిఫలమ్ము కొరకు ప్రాకులాడవు సుమా.
మాలకొండ నోట, మంచి మాట

57. అడగ కుండ, పెట్టదమ్మైన యందురు,
అడగ కుండ పెట్టునదియె అమ్మ,
ఆకలంచు అమ్మనడుగునా, పసిపాప.
మాలకొండ నోట, మంచి మాట.

58. అనుభవైక వేద్య మానందమనునది,
సంతలోన కొనెడు సరుకు గాదు,
కొనగ వచ్చు పాన్పు, కొనగలవా నిద్ర!
మాలకొండ నోట, మంచి మాట.

59. క్రొత్త యైన దెల్ల ఉత్తమంబనరాదు,
పాతదైన దెల్ల రోతగాదు
క్రొత్త, పాతగాదె, కొన్ని క్షణాలలో!
మాలకొండ నోట, మంచి మాట.

60. వెనుక బడితి ననుచు వీధికెక్కినవాడె,
వెనుక బడిన తనము విడిచిపోయె
వెనుక జూడకింక వెడలుము మిత్రమా
మాలకొండ నోట, మంచి మాట!

61. పరుల హింస పెట్టి ప్రాణముల్ తీయుటే
వృత్తి యైన మనుజుడెవ్వడైన
తుదకు హింసతోనె దుర్మరణము జెందు.
మాలకొండ నోట, మంచి మాట.

62. తనకు రక్షయనుచు, మనుజుడు సృష్టించె,
ఆయుధమ్ములతి భయంకరములు
అవియె ఎదురు తిరిగి, అతని ప్రాణము దీసె
మాలకొండ నోట, మంచి మాట.

63. పగలు వెనుక రాత్రి తగిలి యుండినయట్లు,
మంచి వెనుక చెడ్డ పొంచియుండు..
విశ్వమందు వీని విడదీయజాలరు.
మాలకొండ నోట, మంచి మాట.

64. హింస జేయువాని హింసించినంతనే
హింస ఆగిపోదు ఇది నిజమ్ము,
నిప్పు ఆరిపోదు నిప్పు జల్లినయంత.
మాలకొండ నోట, మంచి మాట.

65. చిన్న చేపను, దిని జీవించు పెద చేప,
పక్షి గ్రుడ్లను దిని బ్రతుకు పాము,
నరుడు గూడ అట్లె నడుచుచుండెను నేడు,
మాలకొండ నోట, మంచి మాట.

66. జాతి మతములకు, అతీతులై యున్నారు,
జగతిలోన, రెండు తెగలవారు,
తినెడువారు, మరియు తినబడువారలు.
మాలకొండ నోట, మంచి మాట.

67. అన్నమమ్ముకొనుటె అతి పాపమొక నాడు,
పూలు, స్త్రీలు, జన్మభూమికూడ,
అమ్ము కొనుటె నేటి ఆచారమై పోయె
మాలకొండ నోట, మంచి మాట.

68. పామునోట పట్టుబడి గింజుకొను కప్ప,
పురుగు నొడిసి పట్టు బూనుకొనును,
చావువేళగూడ చావదయా ఆశ
మాలకొండ నోట, మంచి మాట.

69. హత్య చేయబడియె అమెరికా అధ్యక్షు
డంతవాడు, శక్తియెంతొ కలిగి
ఈ జగాన లేదు ఎవరికి రక్షణ.
మాలకొండ నోట, మంచి మాట.

70. కుక్కనొకటి జంప, కోరిక గలదేని,
పిచ్చి కుక్కయనుచు పిలువు ముందు,
పగతునెట్టులైన పరిమార్చు విధమిది.
మాలకొండ నోట, మంచి మాట.

71. మర తుపాకి కలదు మాయింట, మాకేమి
భయమటంచు మురిసిపడకుడయ్య!
ప్రక్కలోని త్రాచు పాముతో సమమది.
మాలకొండ నోట, మంచి మాట.

72. సిలువ వేసినారు జీసను క్రీస్తును
గాంధీపై తుపాకి కాల్చి నారు,
అమరులైరి వారు, అంతమైపోయిరా!
మాలకొండ నోట, మంచి మాట.

73. ధరణిలో అహింస పరమధర్మంబని
మేటినేత యొకడు చాటి చెప్పె
కాదటున్న వాని కంఠమ్ము ఖండించె
మాలకొండ నోట, మంచి మాట.

74. పక్షి కూడ తనదు పాపల బెంచును
గూడు కట్టి యింత కూడు పెట్టి
నాటి కుంతి వోలె నట్టేట విడువదు
మాలకొండ నోట, మంచి మాట.

75. ముసలి తల్లి దండ్రి మొగమైన చూడక,
మసలుచున్న వగలమారి కొడుక!
ముసలి తనము నీకు ముందున్న దెరుగుము
మాలకొండ నోట, మంచి మాట.

76. త్రాగబోకు, పోకు తరుణుల వెంటను,
ఆస్తియంత యిత్తుననియె తండ్రి,
ఆస్తివలదటంచు అలిగిపోయె సుతుండు
మాలకొండ నోట, మంచి మాట.

77. తాతయైన వాడు తనయులకంటెను,
మమత పెంచు కొనును మనుమలందు,
అసలు కంటె, వడ్డి, అతి ప్రియంబగు గాదె
మాలకొండ నోట, మంచి మాట.

78. బిడ్డ కడుపు లోన బడ్డప్పుడే , తల్లి
పొదుగులోన పాలు పోసె, బ్రహ్మ
పాలు బిడ్డకీక, పరులు త్రాగుదురేల!
మాలకొండ నోట, మంచి మాట.

79. బుద్ధి పాలతోడ బిడ్డల పెంచెడు,
నేటి మహిళలార! నిజము వినుడు
బిడ్డ పెద్దపెరిగి బుద్ధికి దాసుడౌ,
మాలకొండ నోట, మంచి మాట.

80. ఆడ, మగ విభేద మంత రించెను నేడు
వలువలందు, బ్రతుకు విలువలందు
మహిళ అబల యనుచు మాటాడరాదిక
మాలకొండ నోట, మంచి మాట.

81. తల్లిరక్తమెంతొ తండ్రి రక్తంబంతె
పిల్లడైన ఆడపిల్లయైన,
కొడుకు, కూతురన్న గొడవలింకేటికో!
మాలకొండ నోట, మంచి మాట.

82. భుజబలమ్ము మున్ను భువిని పాలించెను,
బుద్ధిబలము నేడు భూమినేలు,
బుద్ధిలోన, స్త్రీలు పురుషులొక్కటిగాద!
మాలకొండ నోట, మంచి మాట.

83. అమ్మ కడుపులోనె ఆడపిల్లల జంప,
తగ్గిపోరు స్త్రీలు ధరణిలోన,
స్త్రీ పురుషుల సృష్టి చెరి సగంబెప్పుడు
మాలకొండ నోట, మంచి మాట.

84. బొమ్మ, బొరుసు, సుమ్ము, పురుషుడు స్త్రీయును
ప్రకృతి నాణెమునకు నికరముగను,
బొమ్మ బొరుసు లెట్లు పోట్లాడు కొనునయా!
మాలకొండ నోట, మంచి మాట.

85. అధిక దుఃఖమైన ఆనందమైనను,
కలసి చెమ్మగిల్లు కనులు రెండు,
ఆలుమగల జోడు అట్లుండవలెనయా
మాలకొండ నోట, మంచి మాట.

86. కొడుకు వలయు, తలకు కొరివి పెట్టుటకని
తల్లడిల్లు తల్లిదండ్రులార!
కొరివి మండుకొనద! కూతురు చేతిలో,
మాలకొండ నోట, మంచి మాట.

87. పెండ్లియైన పిదప పేరు మార్పేకాదు,
మగనిలోన సగము మగువయగును,
చిత్ర ఘట్టమిద్ది స్త్రీ జీవితములోన.
మాలకొండ నోట, మంచి మాట.

88. పెంచి నట్టి తల్లి, ప్రేమించు ఇల్లాలు,
చెరొక వైపు లాగు పురుషు బ్రదుకు,
గొయ్యి ముందు, వెనుకనుయ్యి చందంబౌను.
మాలకొండ నోట, మంచి మాట.

89. ఎఱ్ఱటెండలోన ఎద్దులతో రైతు,
నేలదున్నుచుండ, జాలికలిగి,
నింగి బోవు మబ్బు నీడగా నిలిచెరా.
మాలకొండ నోట, మంచి మాట.

90. నాడుతో ''నవాబు'' కూడుగల్గ ''అమీరు ''
బిచ్చమున ''పకీరు'' చచ్చి ''పీరు''
ఎక్కడున్న, పేరుకెక్కు సాహెబుగారు
మాలకొండ నోట, మంచి మాట.

91. పల్లె పొలమునమ్మి పస్తులుండిన రైతు,
పైన పంచె తోడ పట్నమేగె,
స్థలములమ్మి పెద్ద షావుకారైపోయె,
మాలకొండ నోట, మంచి మాట.

92. గ్రుడ్డి తనము కంటె ఘోర శాపము లేదు
అట్టి గ్రుడ్డితనము నభినయించి,
బిచ్చమెత్తు కొనెడు తుచ్ఛులున్నారయా
మాలకొండ నోట, మంచి మాట.

93. ఆడమగలు కలసి, అర్ధనగ్నంబుగా
పడకటింట పడెడు పాట్లు చూపి,
సొమ్ము చేసుకొనెడు బొమ్మలెక్కువయాయె
మాలకొండ నోట, మంచి మాట.

94. అతి భయానకములు, హత్యలు దోపిళ్లు
పలురకాల మానభంగములకు,
శిక్షణాలయములు సినిమాలు నేడయా.
మాలకొండ నోట, మంచి మాట.

95. కలలు గనెడు తలపు కాదనకెప్పుడు,
కళలులేక లలిత కళలు లేవు,
కళలు లేని జగము కాంతి హీనము కదా.
మాలకొండ నోట, మంచి మాట.

96. ఎంకటేశు గొలుచు ఎఱ్ఱజెండా పట్టి,
గుడికి పోయి ''లెనిను'' గొప్ప జెప్పు,
నరుని చిత్తవృత్తి నమ్మశక్యముగాదు!
మాలకొండ నోట, మంచి మాట.

97. మగువ తోడ మగువ, మగని తోడ మగండు,
కోరి పెండ్లి చేసుకొందురంట!
విశ్వనాగరికత వెర్రితలల్ వేసె
మాలకొండ నోట, మంచి మాట.

98. మగువకైన గాని, మగవానికైనను,
హక్కు కలదు పెండ్లి యాడు కొరకు,
ఆఖరైన హక్కు అదియె కాకూడదు.
మాలకొండ నోట, మంచి మాట.

99. నిప్పుజిమ్ముకొనుచు నీవు నింగికి లేవ,
చోద్యమనుచు మెచ్చు చూచువారె,
నేలగూలు వేళ నిర్దయర్ జూతురు,
మాలకొండ నోట, మంచి మాట.

100. కులము లేరుపడియె గుణకర్మములబట్టి
యనుచు జెప్పె, కృష్ణుడర్జునునకు,
కులము మారదేమి గుణకర్మములు మార?
మాలకొండ నోట, మంచి మాట.

101. రాజపదవి యిచ్చి రారాజు ఆనాడు,
కులము నుండి కర్ణు వెలికి దీసె,
పదవి యిచ్చి కులము బాపరా యీనాడు.
మాలకొండ నోట, మంచి మాట.

102. ఐదురూకలిచ్చి, ఐదువందల కీర్తి,
తక్షణంబె కోరు దానపరులు,
వీధి, వీధి కొకరు వెలసిరయా నేడు
మాలకొండ నోట, మంచి మాట.

103. బర్రె తినని పండు బాపనయ్యకొసంగి,
దానఫలము గోరు దాతలార!
పుచ్చుగింజ నుండి, పుట్టునా వృక్షమ్ము!
మాలకొండ నోట, మంచి మాట.

104. ఉల్లి తినకుడంచు, ఊరిజనుల కెల్ల
హితము జెప్పు స్వామి, యింటికేగి
ఉల్లి లేదటంచు, పెళ్లాము పైనల్గె,
మాలకొండ నోట, మంచి మాట.

105. లంచమిచ్చి, అధిక లాభ మొందెడు వాడు
నిక్కువముగ పెద్దనేరగాడు
అతడులేకయున్న అవినీతియేలేదు
మాలకొండ నోట, మంచి మాట.

106. వెన్నదొంగ వెలసె వ్రేపల్లెలోనాడు
పల్లెలోన నేడుపన్నుదొంగ,
ఇరువురేలువారు, ఇలను సర్వస్వము,
మాలకొండ నోట, మంచి మాట.

107. అంటరాని వాడు ఆంగ్ల విద్యలు నేర్చి
దొరలవేషమందు తిరిగిరాగ,
కౌగిలించు కొనిరి కసరి కొట్టినవారె,
మాలకొండ నోట, మంచి మాట.

108. అంటుకొనుట పాపమగునెట్లొ తెల్పుడీ?
అంటుకొనక, సృష్టి ఆగిపోదె,
పతిని అంటకున్న సతికి సంతతి యున్నె!
మాలకొండ నోట, మంచి మాట.

109. ఉన్న వానిదిల్లు, దున్నువానిదె భూమి,
కొట్టువాని దగును పిట్ట నేడు
నవసమాజమందు న్యాయ సూత్రములివి.
మాలకొండ నోట, మంచి మాట.

110. ప్రజలకింతదాక ప్రతినిధులుండిరి
పార్లమెంటులోన, ప్రభుతలోన
ప్రస్తుతమ్ము వారు పైరవి కారులు
మాలకొండ నోట, మంచి మాట.

111. ప్రజలు, ప్రభువు, కలిసి పంచుకోవలె, కష్ట
సుఖములన్న ధర్మ సూత్రమరసి,
ప్రజకు కష్టమిచ్చి, ప్రభువు పొందె సుఖాలు
మాలకొండ నోట, మంచి మాట.

112. నీతి నిజము దెలియు నేత వచించును
ప్రజలలోన తాను భాగమనుచు,
నేనె ప్రజలటంచు నిక్కి పల్కు నియంత.
మాలకొండ నోట, మంచి మాట.

113. పదవి మెట్లనెక్కి పైకి పోయెడువేళ,
పొరుగునున్నవారి మరచితేని,
క్రింద బడెడు వేళ గేలి గావింతురు
మాలకొండ నోట, మంచి మాట.

114. చేయదలచుకొన్న దేయదియైనను
ప్రక్కవారి నోట పలుక జేసి,
కార్యసిద్ధి పొందు ఘనుడె నాయకుడయా
మాలకొండ నోట, మంచి మాట.

115. యుద్ధమందు వీరుడొక్క మారే చచ్చు,
రాజకీయ వాది, రోజుచచ్చు
పుట్టగొడుగు లెన్ని పుట్టిచచ్చుటలేదు!
మాలకొండ నోట, మంచి మాట.

116. భరత దేశమేలు పలువురు రాజులు,
తగవులాడుచుండ తమకు తామె,
తెల్లవాడు దేశమెల్ల చేకొనె గదా.
మాలకొండ నోట, మంచి మాట.

117. గడ్డిపోచలెల్ల కలిసి త్రాడుగమారి,
కట్టివైచు మత్తగజమునైన,
కలిసి కట్టుతనమె గెలుపుకు మార్గంబు,
మాలకొండ నోట, మంచి మాట.

118. బాటకు కుడివైపు పయనించు అమెరికా
బాటకెడమవైపు గ్రేటు బ్రిటను,
బాటమధ్య నడచు, భారత దేశంబు.
మాలకొండ నోట, మంచి మాట.

119. సభకు వచ్చి జనము చప్పట్లు కొట్టిరి,
ఓటు వేయకుండ దాటుకొనిరి,
ఊహకంద దౌర! ఓటరు హృదయమ్మ,
మాలకొండ నోట, మంచి మాట.

120. ప్రతి కచేరిలోన పనులకడ్డమువచ్చు,
విఘ్నరాజులిపుడు వెలసినారు,
తొలుత, విఘ్న రాజు కొలుచుట అందుకే,
మాలకొండ నోట, మంచి మాట.

121. తెల్లదొరతనాన తెల్ల ధనంబుండె,
నల్ల దొరతనాన నల్ల ధనము
నల్ల ధనమునేడు నడుపును రాజ్యము,
మాలకొండ నోట, మంచి మాట.

122. ప్రజల సేవ చేయ పరితపించెడువారు,
పరుగులిడగనేల పదవి కొరకు?
సేవకాదు సొంతసేవకీ తిప్పలు
మాలకొండ నోట, మంచి మాట.

123. సీతనడివికంపె శ్రీరాముడానాడు
చాకియొకడు మాటజారినంత,
కోర్టు తీర్పులెక్కగొనరు నేతలు నేడు
మాలకొండ నోట, మంచి మాట

124. ఒకడె దేవుడరయ, సకల మతాలకు,
అతని చేరుకొనెడు గతులె వేరు,
గతుల మధ్య నలిగి హతులైరి యెందరో
మాలకొండ నోట, మంచి మాట.

125. మతము భాష, రంగు మారిన నేమాయె
జగతి యందు, మనుజ జాతి యొకటె
తెల్ల రంగులోనె ఎల్లరంగులు లేవ!
మాలకొండ నోట, మంచి మాట.

126. మతములోని వారి మధ్యను కొట్లాట,
కులము లోనె యెపుడు కుమ్ములాట
ఆధిపత్యమునకె అగచాట్లు ప్రతిచోట
మాలకొండ నోట, మంచి మాట.

127. స్వార్థమొకటె యేలు సర్వ జగత్తును
స్వార్థముడిగెనేని శాంతి గల్గు
కులము, మతము, భాష కుంటి సాకులు సుమా!
మాలకొండ నోట, మంచి మాట.

128. మతము పేరనొకడు మాయలు సృష్టించు,
కులము పేర జనుల కూడగట్టు
ఓట్ల కొరకె యిన్ని పాట్లని తెలియరా
మాలకొండ నోట, మంచి మాట.

129. మతము మత్తుమందు మానవజాతికి
మంచి తెలియలేరుమత్తులోన,
మత్తు దిగక పోదు మరికొన్ని నాళ్లలో,
మాలకొండ నోట, మంచి మాట.

130. దైవరూపముండు తనరూపు వలెనని,
శిలను చెక్కి పూజ సేయునరుడు,
ఎవరి రూపు వారికెల్ల వేళల ముద్దు.
మాలకొండ నోట, మంచి మాట.

131. పాపులను క్షమించు ''బైబిలు'' పోరాడు
మనును ''గీత'', శరణమను ''కొరాను''
మూడు మతములందు మూల సూత్రములివి
మాలకొండ నోట, మంచి మాట.

132. ఏ మతమ్ముగాని, ఏ వర్గమైనను
ఎదుగుకొలది చీలు, నిది చరిత్ర
చెట్టు పెరుగు కొలది చీలదా శాఖలై.
మాలకొండ నోట, మంచి మాట.

133. మతములన్ని లోక హితమునే ప్రవచించు,
మధ్యవర్తులైన మతగురువులు,
తిమ్మి, బమ్మి చేసి తీర్పులిచ్చెదరయా!
మాలకొండ నోట, మంచి మాట.

134. ప్రకృతి సిద్ధమైన పరమాద్భుతములకు,
కర్త యెవడో మనకుకంటబడడు,
అతని వెదకు కొనుటె అసలైన మతమురా,
మాలకొండ నోట, మంచి మాట.

135. సత్యధర్మ ప్రేమ శాంతులు బోధించె,
ప్రతి ప్రవక్త నరుల బాగుచేయ,
అతడు పోవు వెనుక అన్నియు మరచిరి
మాలకొండ నోట, మంచి మాట.

136. పిల్లికైన నింత బిచ్చముపెట్టని
పరమ లోభులమిత భక్తి తోడ
కోట్లు 'స్వామి' చెంత గ్రుమ్మరించిరదేమొ,
మాలకొండ నోట, మంచి మాట.

137. కత్తి గొంతు మీద కెత్తిన దొంగకు
ఇనుప పెట్టె తాళ మీయరైరి,
ఉన్న సొమ్ము ''స్వామి'' హుండిలో వేసిరి,
మాలకొండ నోట, మంచి మాట.

138. పదవి శాశ్వత మని భ్రమసి, అహంకార
మత్తులై న నాయకోత్తములును,
స్వామి కాళ్ల మీద సాష్టాంగ పడిరిపో!
మాలకొండ నోట, మంచి మాట.

139. విబుధ జనులు , శాస్త్ర విజ్ఞాన వేత్తలు,
ప్రణతులిడిరి " స్వామి" పాదములకు,
హేతు వాదులకిది యెట్లు మింగుడుపడు,
మాలకొండ నోట, మంచి మాట.

140. పరుల సొమ్ము కాసపడగూడదని చెప్పి
లేగనోటి పాలు త్రాగె స్వామి,
నీతి జెప్పువాడు నియమమ్ము తప్పెను,
మాలకొండ నోట, మంచి మాట.

141. అన్ని సిరులు దేవుడందరి కీయడు,
ఇచ్చెనేని అహము హెచ్చి పోవు,
హెచ్చెనేని, దేవునెవడు గుర్తించును!
మాలకొండ నోట, మంచి మాట.

142. పదవి పెద్దదైన, పెదవి విప్పగరాదు,
అందువలన దేవుడయ్యె, రాయి
రాయి, పెదవి విప్ప రాయితో గొట్టరా!
మాలకొండ నోట, మంచి మాట.

143. హంతకుండు మరియు హతుని యిల్లాలును
గుడికి వెళ్లి వరము గోరుకొనిరి,
దైవమెవరి వైపు దయజూప వలయునో!
మాలకొండ నోట, మంచి మాట.

144. సృష్టికర్త, సృష్టి సృష్టించె నందురు,
సృష్టికర్త నెవడు సృష్టి జేసె,
స్పష్ట పరచు నెవడు సృష్టిరహస్యమ్ము!
మాలకొండ నోట, మంచి మాట.

145. అగ్ని పర్వతమును, ఆటము బాంబును,
ప్రేలకుండ ఆపజాలు నరుడు,
ఆపలేడు విప్లవాత్మక భావముల్
మాలకొండ నోట, మంచి మాట.

146. ఒక్కగంట చాలు ఉర్విని చుట్టిరా,
అరక్షణాన, వార్తలంపవచ్చు
ఎంత చిన్నదాయె ఈ ధరావలయమ్ము!
మాలకొండ నోట, మంచి మాట.

147. ఎంత మంది మిత్రు లెదురింటనున్నను
కానబడరు అవసరాన దప్ప,
శత్రువొక్కడున్న సర్వదా కనిపించు
మాలకొండ నోట, మంచి మాట.

148. అచ్చమైన మిత్రుడరుదుగా లభియించు

అట్టివాని వదలి పెట్టవలదు

పట్టియుంచవలయు పసిడి సంకెళ్లతో

మాలకొండ నోట, మంచి మాట.

149. అన్ని చోట్ల జీవులందరి తోనుండ

వీలు కాక నేమొ విశ్వకర్త

తనకు బదులు భువికి తల్లుల బంపించె

మాలకొండ నోట, మంచి మాట.

150. ఎవరు నేరగాళ్లు ఈ ప్రపంచములోన

ఆయుధములు చేసి అమ్మువార!

కొనెడువార! చేతగొని చంపువారలా!

మాలకొండ నోట, మంచి మాట.

151. గుడిసె లేని నరుడు, గుడిలేని దేవుడు
విత్తమిమ్మటంచు వెంటబడిరి
ఎవరి కోర్కె తీర్ప నెంతువో తేల్చుకో
మాలకొండ నోట, మంచి మాట.

152. అడవిలోన ఏన్గు లాడినా, కూడినా,
గడ్డినల్గు వాటి కాళ్ల క్రింద
పెద్ద వాళ్ల మధ్య పేదల బ్రతుకింతె
మాలకొండ నోట, మంచి మాట.

153. అన్నికొన్నయట్లె అంగడిలో విద్య
కొనదలంచు కొన్న కుర్రవాడ!
కొనిన లాభమేమి గుండ్లు లేని తుపాకి
మాలకొండ నోట, మంచి మాట.

154. గుడ్డు పెట్టగానె గొంతెత్తి కూయును
కొక్కొరకో యటంచు కోడి పెట్ట
అల్ప జనులు చేయు ఆర్భాటమిట్టిది.
మాలకొండ నోట, మంచి మాట.

155. బొగ్గుపులుసు గాలి భుజియించి వృక్షముల్
ప్రాణ వాయువిచ్చు ప్రాణితతికి,
చెడును మ్రింగి మంచి చేయుదురుత్తముల్
మాలకొండ నోట, మంచి మాట.

156. చదివినానటంచు సర్టిఫికేటును
చేతికిచ్చినాడు శిష్యుడొకడు
ప్రశ్నవేసినంత పరుగెత్తి పోయెను
మాలకొండ నోట మంచిమాట

157. హాని చేయబూను అల్ప శత్రువునైన
గుర్తుపట్టి తప్పుకొనగవచ్చు
తప్పుచేయుమిత్రు తప్పించుకొనుటెట్లు
మాలకొండ నోట మంచిమాట

158. మోసగించినాడు మునిపత్ని నింద్రుడు
అతడె దేవతలకు అధిపుడయ్యె
అధిపుడగుట కొరకు అర్హతయిదియొనె!
మాలకొండ నోట మంచిమాట

159. అవయవమ్ము ప్రతిది అలసి నిద్దురపోవు,
నిద్రపోనిదొకటె నీదు గుండె
అట్టిగుండెనీకు ఆదర్శమగుకాక
మాలకొండ నోట మంచిమాట